# నిర్వచన
# భారతగర్భరామాయణము




గ్రంథకర్త:

రావిపాటి లక్ష్మీనారాయణ.





మొదటికూర్పు 1000

శ్రీవేంకటేశ్వర ముద్రాక్షరశాల, గుంటూరు.

1938




[వెల 0—12—0

# పండితాభిప్రాయములు

కడియము తూ॥ గో॥ డి. 29-5-32

నిర్వచనభారతగర్భరామాయణమను నీ క్రొత్తపోకడగల పొత్తమును మ॥ రా॥ శ్రీ॥ రావిపాటి లక్ష్మీనారాయణ గారు రచించిరి. ఇందుఁ బ్రతిపద్యమందును గర్భకవిత్వముండుననునంశము నామమువలననే స్ఫుటమగుచున్నది. కానవిస్తరింప బనిలేదు. ద్వ్యర్థి కావ్యముల రచించినవారు కలరుకాని యింతవఱకుఁ గర్భమెల్ల నిట్లు రచించినవారు నాబుద్ధికిఁ బొడగట్టరు. ఇట్టి కష్టతరమగు రచనకుఁ బూనుకొన్న యీ కవి రచనలో నావిన్నయంతలో వ్యాకరణాది దోషములు లేశమును గానవచ్చుటలేదు. నిర్దుష్టమై రసవంతమైయున్న యీయన రచనను నేను మిక్కిలిగా నభినందించుచున్నవాఁడను. దీనినివిద్యాశాఖ వారు తప్పక స్వీకరింతురని నా పూర్ణవిశ్వాసము.

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి
శతావధాని

C. R. Reddi. Padmaprabhasa, Chittore.

Dear Sir,

Thanks. Yours is a very creditable performance. Your taste and scholarship are admired.

Yours truly
C. R. Reddi

రాజమండ్రి 9-4-32

అయ్యా!

తమరు పంపిన జాబును మీరు రచించిన «నిర్వచనభారతగర్భరామాయణమును వ్రాఁతప్రతిని చాలభాగము చదివినవాఁడను. ఇందులో మీరు మిక్కిలి శ్రమచేసినారని చెప్పుటతిశయోక్తి కాజాలదు. ప్రతి పద్యమునందును గర్భపద్యములు చెప్పుటయే కష్టము. అందుపై మూలపద్యములు రామాయణము గర్భస్థపద్యములు భారతమును వెల్లడించునట్లు గ్రంథము వ్రాయుట కష్టతరమని చెప్పకచెప్పెడిని. మీ శ్రమకు నేను మిక్కిలి యాశ్చర్యము నొందితిని. ఇప్పటి వారిట్లు గర్భ

శ్లేష కవిత్వము చెప్పుటరిది. మీపద్యములు ధారాళముగనున్నవి. గర్భ, వృత్తములుండియు శ్లేషగలిగినను మృదుత్వమును శయ్యాసౌష్టవమును విడువక మనోహరముగానున్నవని త్రికరణశుద్ధిగా చెప్పుచున్నవాడను

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

మహారాజశ్రీ రావిపాటి లక్ష్మీనారాయణ గారికి వడ్డాది సుబ్బారాయుడు వినతినిగావించు విన్నపము.

అయ్యా!

మీరలాదర పూర్వకముగా నంపిన భవద్విరచిత భారతగర్భరామాయణ ముద్రిత పత్రములు చేరినవి, అపూర్వమయిన నియమము తో రచించిన మీ గ్రంథము నాశ్చర్యము కలిగించినది.

మ॥ ప్రతిపద్యంబున వేఱువేఱ్వియమముల్ పట్టించి ప్రాసంబులున్
యతులున్ వ్యాకృతినీమముల్ చెడకయుండం గావ్యముంజేయుటే
యతికష్టంబిటు పద్యమందితర పద్యంబొందు నొప్పించి భా
రత రామాయణగాథ లేకకృతి గూర్పంజాలి తేమందునిన్॥

తే॥ నిండుఁజూలాలు తాపసినెమ్మి రామ
కథనుడువుచుండ, భారతగాథగర్భ
శిశువుపలికెడు భంగి భాసిల్లు రావి
పాటిలచ్చినారాయణు పద్యపఙ్క్తి

చిత్తగింపుఁడు

వ॥ సుబ్బారాయుఁడు.

12-12-3౭ రాజమహేంద్రవరము

మహారాజశ్రీ రావిపాటి లక్ష్మీనారాయణ గారికి చిలకమర్తి లక్ష్మీనరసింహము దీవించి వ్రాయునది

ఆర్యా!

మీరు దయతోఁబంపిన నిర్వచన భారతగర్భ రామాయణమను గ్రంథము చేరినది. చదివించుకొంటిని. ఈకాలముననిట్టి గ్రంథము రచియించువారు మిక్కిలి యరుదుగనున్నారు. మీ పాండిత్యము మీ ప్రతిభయు, మీకవితాధారయు, మిక్కిలి శ్లాఘాపాత్రములుగనున్నవి.

నడుమ నడుమ కోష్ఠ్య పద్యములు, ముక్తపదగ్రస్తములు, మొదలైన చిత్రకవిత రచించుటయు మిక్కిలి ప్రశంసనీయము. కవిత్వముచాలవఱకు సులభమై లలితమైయున్నది. భగవంతుఁడు మీకు దీర్ఘాయురారోగ్యములనిచ్చి రక్షించుఁగాక.

ఇట్లు
మీ శ్రేయోభిలాషి
చి॥ ల॥ నరసింహం

నెల్లూరు 22-12-32

అయ్యా!

తాముపంపిన గ్రంథభాగమందినది. స్థాలీపులాకన్యాయముగా పఠించితిని. సనాతనాధునాతనకవులెవ్వరు త్రొక్కియెఱుఁగని క్రొత్తమార్గమును త్రొక్కిన మీ యువజ్ఞ కొనియాడదగినది. రామాయణమున భారతమిమిడ్చిన మీ సామర్థ్యమనల్పము. పద్యమునందన మాటయొక సర్గానుమర్చుటయే దుష్కరము. అట్టిచో నా పద్యములను బంధముల నిబంధించుటకడు దుష్కరము. ఇన్ని నిర్బంధములకులోనై కావ్యము సలక్షణముగా కొనసాగించిన మీ కవితాపాండితి పండితశ్లాఘ్యముగదా.

ఇతి నతయః
దీపాల పిచ్చయ్యశాస్త్రి

మహాశయా!

తమరనిపిన "నిర్వచన భారతగర్భ రామాయణమును" వ్రాఁతపుస్తకమునుఁ గొంతభాగము చదివితిని. ముద్రించుప్రతియు నింతలోఁ జేరెను. దానినంతయు బఠించితిని. ఇది క్రొత్తసృష్టియనవలెను. ఈప్రయత్నము మున్నెవ్వరు చేసియున్నట్టు నాయెఱింగినంతదనుకఁ గనఁబడదు. ఇది విశ్వామిత్రసృష్టివలెఁ గాక శతానందుని సృష్టివలె సకలజనానందకరమై చెన్నారుచున్నది. మీపట్టినశ్రమము కృష్ణదేవరాయలవంటి ప్రభువు కాలముననే యైనన భినవవాగనుశాసనుఁడన్న బిరుదము లభించి[illegible]నని నావిశ్వాసము. "సమానానాముత్తమ శ్లోకో అస్తు" అను సూ[illegible]నా హారణ భూతులరైతిరి. మీ యీకృషిసర్వవిధముల సంస్తుత్యము. పరమేశ్వరానుగ్రహమున నీకృతి దశదిశల వ్యాపించి యెసంగుఁగాతమని వారలఁ గోరుచున్నాఁడను. ఈకృతికన్యకామణి సదమలలంకారశోభితయై సద్వర్ణవిరాజమానయై మనోజ్ఞరూపమున నలరాఁగ సరసకవిజనానందదాయినియై నిత్యపూతయై సతతసమ్మతిసజ్జనవ్రీతయై యెసంగుంగాక.

ఇట్లు విన్నవించు

సత్కవి శ్రేయోభిలాషి

జనమంచి శేషాద్రిశర్మ.

# అవతారిక

శ్రీమదాంధ్రభాషను సర్వతోముఖముగ నొనర్చినంగాని దాని నుండివలసిన లాభములఁబొందలేము. నవలలు నాటకములు, జీవితములు, ప్రబంధములు, చరిత్రలు, లక్షణగ్రంథములు, విమర్శనలు, వ్యాకరణములు, కోశములు నిఘంటువులు మొదలగునవి యాంధ్రవాఙ్మయమునందలి యంతర్భాగములు.

కావ్యలక్షణమును భోజుఁడు శ్లో॥ నిర్దోషం గుణవత్కావ్య మలంకారై రలంకృతం। రసాత్మకం కవిః కుర్వన్। కీర్తిం ప్రీతించవిందతి” యని వ్రాసినాఁడు నరసభూపాలీయమునందును “కవితాలతాంగికి వాచకటకకంకణాదుల క్రియ నలంకరణకరణపరిణాహులచే నలంకారభావమొందు” నని వ్రాసియున్నాఁడు “నిరంకుశాః కవయః” యనినట్లు బ్రహ్మసృష్టి కంటె కవిసృష్టి యతీతము. బ్రహ్మసృష్టి ప్రకృతి ననుసరించియే యెల్లప్పుడుండును. కాని కవిసృష్టి యొక్కొక్కచోఁ బ్రకృతి విపరీతము.

ఉభయభాషాపాండిత్య సామర్థ్యమునుఁ దెల్పుకావ్యములలో పింగళి సూరనార్యుని రాఘవపాండవీయమును, రామరాజభూషణుని హరిశ్చంద్రనలోపాఖ్యానము నన్నికెక్కినవి. పోడూరి పెదరామామాత్యుని శివరామాభ్యుదయము, పిండిప్రోలు లక్ష్మణకవి రావణదమ్మీయము, మంత్రిప్రగడ సూర్యప్రకాశకవిగారి కృష్ణార్జునచరిత్రము, మృత్యుంజయకవి ధరాత్మజాపరిణయము మున్నగు ద్వ్యర్థికావ్యములును నయ్యగారి వీరభద్రకవిగారి రాఘవపాండవయాదవీయము, భట్టు బాలసరస్వతికృతమగు రాఘవయాదవపాండవీయము, నెల్లూరి వీరరాఘవకవి యాదవరాఘవపాండవీయము, ఓగంటి సోమశేఖరకవి రామకృష్ణార్జునరూపనారాయణీయము మున్నగుత్ర్యర్థులుగలవు. సంస్కృతమునందుఁ జితంబరకవి ప్రణీతమగు రాఘవపాండవయాదవీయ మొకటి వావిళ్ళవారిచేఁ బ్రకటింపబడినది మా గ్రంథాలయమునఁ గలదు.

ఇక నిర్వచనకావ్యములు తిక్కననాటినుండి కుప్పతెప్పలుగా బయలుదేరుచున్నవి.

పూర్వకవీంద్రవిభాగితచతుర్విధాంధ్ర కవిత్వంబులలో గర్భకవిత్వం బొకటి. ఒకపద్యంబునఁ బెక్కుపద్యంబులిమిడి ఛందోర్థదోషములు లేకుండునది గర్భకవిత్వంబు. పూర్వ కవీంద్రుల ప్రబంధములలో నచ్చటచ్చటను, నాశ్వాసాంతములందును, గణపవరపు వేంకటకవిగారి ప్రబంధరాజపరమేశ్వర వేంకటేశ్వర విజయవిలాసమందుఁ గొంచెము విరివిగా గర్భకవిత్వంబు గన్పట్టుచున్నది. గ్రంథాదినుండి యంత్యమువఱకు గర్భకవిత్వముతోఁ దనరారు కావ్యమెందును నింతవఱకు మేముచూడలేదు. ఈనిర్వచనభారతరామాయణ మిట్టికొఱఁత దీర్చినది.

గ్రంథకర్త యార్వేల నియోగి బ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. పోతనాదికవులు జన్మించిన కౌండిన్యగోత్రుఁడు. గుంటూరు జిల్లా నరసరావుపేటతాలూకా రావిపాఁడు స్వగ్రామము. ప్రస్తుతము గురుజాల డిస్ట్రిక్టుమునసఫ్ కోర్టులో గుమాస్తాయుద్యోగమందున్నాడు. ఆంధ్రమందేగాక హూణవిద్యయందునుఁ బ్రవేశముగలదు. ఈ గ్రంథమందుఁ బ్రతిపద్యమందు మఱియొకపద్యము గర్భస్థమైయుండును. మూలపద్యములు రామాయణార్థము, గర్భస్థపద్యములు భారతార్థమిచ్చును. కవిత్వము నిర్దుష్టమై రసవంతమై, వ్యాకరణాదిదోషరహితమై సకలగుణమైయున్నది. ధారాళముగాను ద్రాక్షాపాకముతో నొప్పుచున్నది. శ్లేషమెక్కుడులేక సులభముగానున్నది. అయిన నేకథ కాకథచదివినఁ జాల సులభముగానుండును, అక్కడక్కడ ప్రౌఢముగా లేకపోలేదు. ఉదాహరణము:— సూర్యాస్తమయములోపల సైంధవునిఁ జంపుటయును, నట్లుచేయలేనిచో నగ్నిఁ జొచ్చుటయును ప్రతిజ్ఞ నర్జునుఁడు సేయుటయును భారతార్థము గర్భమునగలిగి రాముని జంపెదనని యింద్రజిత్తు రావణునితోఁ బలుకుటయును రామాయణార్థముగల 109 వ పద్యము.

అచ్చతెలుగుపద్యము, చతుర్విధాష్టవిధకందములు, నిరోష్ఠ్యము, ముక్తపదగ్రస్తము పుష్పమాలికాబంధము, నాగబంధములయందును గర్భపద్యముల వదలకయేర్పఱచుట యీతని భాషాసామర్థ్యమును వె

ల్లఘించుచున్నది పరఁగ జిగురాకుచేతుల, యను 41వ పద్యమునందును 'అని విజయరతుకై' యను 102వ పద్యమునందు శ్లేషాలంకారమును, 101వ పద్యమున నుపమాలంకారము లతిహృద్యములుగానున్నవి వివాహవేదికయందు సీతరాముని కంఠసీమను బుష్పమాలికవేయుటనుఁ బుష్పమాలికాబంధమందేవ్రాసి చమత్కరించినాడు. 44, 45, 46, 47, 48 పద్యములుచాల స్వభావికముగాను మనోజ్ఞముగానున్నది.

మఱియునుభయకథలలోను వివాహముల శ్లేషించిన పిమ్మట పరత్యాగమన్నమును శ్లేషింపవలసియున్నది. మధ్యను రామాయణమునఁ గైక దశరథుని వరములడుగుట మొదలగు కొద్దికథయేయున్నది. కాని భారతమునఁ బాండవులు నియమమేర్పరుచుకొనుట, యర్జునతీర్థయాత్ర, సుభద్రా వివాహము; నభిమన్యుజననము. ఖాండవదహనము, ధర్మరాజ యావత్రాజ్యాధిపత్యము; మయసభ; జరాసంధవధ; రాజసూయము; శిశుపాలవధ; జూదము; ద్రౌపదీవస్త్రాపహరణము; భీముని ప్రతిజ్ఞ; పునర్ద్యూతము మొదలగునవికలవు. పింగళి సూరనార్యుఁడు పరశురాముని నిలువఁబెట్టి భారతకథను జాలవఱకు నడపించియున్నాడు. కానియితడట్లుచేయకయే పైఁజెప్పినకథాంశములలో దేనినైనను వదలకయే వ్రాసినాఁడు.

రామాయణమున సూర్యాస్తమయవర్ణ్నోత్ప్రేక్షలో (59పద్యము) జరాసంధవధ నిముడ్చుటకష్టసాధ్యము. సీసపద్యగర్భమందు శార్దూలోత్పలచంపకమాలలిముడవు అయినను మూలపద్యమున గురువైనదానిని(52వ పద్యమునాశ్వాసాంతకపద్యము) గర్భపద్యమున లఘువుగాను లఘువైనదానిని గురువుగాను (54వ పద్యము) మార్చి యిమిడ్చి పెద్ద పద్యములో దేనిలోనైననుఁ జిన్నపద్యము దేనినైననిముడ్చవచ్చునని చూపినాడు కృష్ణరాయభారము సుందరకాండస్థ హనుమంతిరావణ సంభాషములారోక్తిమయములుగా నున్నవి.

'నిక్కంబునామాట(నక్కయెక్కడ మఱినాకమెక్కడవారి) జాతుడవని' (86వ పద్యము). రామాయణార్థమున 'వారిజ—అత్తుఁడు'

ప్రాసచో 'అ' కారమునకు స్వరయతి రావలసి యుండుటచేతను; భారతమున 'నక్క' యనుచో 'న' కారమునకు వ్యంజనయతి రావలసియుండుటచేతను స్వరవ్యంజనములు రెంటికి పనికివచ్చు 'నాకమ'ను నుభయవడినిచ్చినాడు. (యల|జడిగావణుజన నాశగానిపోకనిద్రమకమునవీడిదైవ) మాతృపితృ' (117వ పద్యము) రామాయణార్థమున వ్యంజనయతియు భారతార్థమున ప్రాసయతియువచ్చునట్లు 'దమకము' నుప్రయోగించినాడు. సంగరమహీ (మాతులబంధనముడచేతం గృష్ణ)...(119వ పద్యము) రామాయణమున 'మహిమ — అతుల' యనుచో 'అ' కారమునకు స్వరయతియు భారతమున 'మాతుల' యనుచో 'మ' కారమునకు వ్యంజనయతియు రావలసియుండుటచేని రెండుయతులవడలి 'చేత' యను ప్రాసయతిని ప్రయోగించినాడు. ఇట్టి చిత్రంబులెన్ని యేనియుంగలవు.

98, 99, 100 పద్యములలో నొక్కొక్క పద్యమందొక్కొక్క రసమునుంచి యాయా రసనామములను నాయా రామాయణార్థపద్య చతుర్థపాదాంతమున నడిపి చమత్కరించినాడు. "నేతవీడుము కుమతిని విను సీతాజననంబు లంకచేటునకె సుమీ" యనుచో (98వ పద్యము) భారతార్థమున 'సీతాజననంబు లంకచేటునకె సుమీ' యనుపద సామెతగా ప్రయోగించి సీతపుట్టుట లంకకెట్లుచేటో యట్లె దుర్యోధనుని పుట్టుక ధృతరాష్ట్రుని రాజ్యశ్రీనాశనమునకేయనునర్థము ధ్వనింపజేసినాడు.

దుష్కరమగు గర్భశ్లేషలు డగను గ్రంథమునందచ్చటచ్చట కోకొల్లలు; దేశీయములు, కవిసమయములు నలంకారములు చక్కగాం బొందుపఱచినాడు. మచ్చునకు.

"సుకృత పదహాసులం బూటినీపై నంబఱపూలతెల్పు శుభము" (94వ పద్యము)......కవిసమయము.

| | | |
|---|---|---|
| అవనిందా మరలంపనైచాల | పేజి 11 | పద్యము 29 |
| శుభస్యశీఘ్రమ్ము | 23 | 53 |
| ఒకటి తానెంచదైవ మింకొకటిచేయు | ,, | ,, |
| మూడుపూలారుకాయలగునటంచు | 24 | 54 |
| రంగరంగవైభవములతో | 27 | 58 |

కొన్నిశ్లోకోక్తులను రెండుపద్యములకు వచ్చునట్లు వ్రాయుట దుస్తరము (పుట 45 88వ పద్యమునుజూడుడు). ఇట్టి వెన్నియోకలవు.

కథాద్వయమైత్రిలో గొన్నిముఖ్యమార్పులు

| పింగళి సూరనార్యకృతరాఘవపాండవీయము. | ఈ గ్రంథము. |
|---|---|
| 1 విశ్వామిత్రునితో రామలక్ష్మణులు పోవుట. పాండురాజమరణము. | విశ్వామిత్రునితో రామలక్ష్మణులు పోవుట పాండవులు వారణావతమునకు వెడలుట |
| 2 రామపరశురాముల సంభాషణము. భారతములో గ్రంథాంతవఱకు | రామ పరశురామ సంభాషణము లేదు. |
| 3 సీతను రావణుడు హరించుట జటాసురుడు ద్రౌపదిని హరించుట | సీతను రావణుడు హరించుట సైంధవుడు ద్రౌపదినిహరించుట. |
| 4 అంగదరాయబారము కృష్ణరాయబారము | సుందరకాండములో హనుమంతరావణసంభాషణ కృష్ణ రాయబారము |
| 5 అతికాయవధ ద్రోణవధ | మూలసైన్యవధ. ద్రోణవధ. |
| 6 ఇంద్రజిద్వధ కర్ణవధ. | కాలనేమివధ. కర్ణవధ. |
| 7 విరూపాక్షవధ. శల్యవధ. | మాల్యవంతవధ. శల్యవధ. |

మున్నగునవి.

'శ్లేషే సఖండనిర్బిందోర్వర్ణ్యస్సమ్మేళనం క్వచిత్' అను నథర్వణ కారికావచన ప్రకారమున శ్లేషయందచ్చటచ్చట వర్ణానుస్వారములవలను, నిర్బిందువులనందును సమ్మేళనము చేయబడినది. ఇతను ముఖ్యకథాంశము దేనిని వదలలేదు. రాఘవపాండవీయమందు గనుపట్టని భగవద్గీతా విషయమును గూడ నిమిడ్చినాడు.

సూరనార్యుని యంతటిప్రజ్ఞానిధియు "రెండర్థముల పద్యమొక్కటియు నిర్మింపగ శక్యంబు గాకుండు దద్గతి కావ్యమెల్లయగునే" యని వ్రాసికొనినాడు. అట్టిచో శ్లేషయేకాక గర్భకవిత్వము వ్రాయుట కష్టతరము "స్యాతామదోషౌ శ్లేషౌదానిహతార్త్తాప్రయుక్తే" యని యాలంకారికవచనమున్నను, నీకవి సుప్రసిద్ధార్థములుగల పదములనే ప్రయోగించి, లక్షణవిరుద్ధములగు మార్గముల బోక, సరళముగాను స్వ

తంత్రముగానువందఱకుఁదేటతెల్లముగా వ్రాసినాఁడు అసామాన్య కృత్యములు వ్రాయలేదు.

శబ్దములవందముగా నితర కథలోనికిమార్చినాడు. స్థాలీపులాక న్యాయముగా నుదాహరణము:—ఏకచక్రపురము (84వపద్యము) రామాయణార్థమున ఏక-ఒక, చక్ర-విష్ణుచక్రముయొక్క, రమ-శక్తియనియు, భారతమున, ఏకచక్ర-ఏకచక్రమనఁబడు, పురము.—అ-పురమే యనియు విగ్రహమునిచ్చినాడు.

ఈగ్రంథకర్త వయస్సిరువదిమూఁడు సంవత్సరములు. ఇట్టి బాల్యమున రచించిన యుత్కృష్టతరమగు కావ్యములో దోషములఁ బాటింపక మఱికొన్ని గ్రంథములరచించుటకుఁ బ్రోత్సాహమొసంగెదరని చదువరులనుఁ బ్రార్థించుచు గ్రంథవిస్తరభీతిచే నింతటితో విరమించుచున్నాము.

ఇట్లు,
బుధవిధేయులు,

గజ్జలకొండ
కర్నూలుజిల్లా
30-12-32

గారావఝుల రామకృష్ణసీతారామ సోదరకవులు
శతావధానులు
ఆశుకవిచక్రవర్తులు, అభినవబాణకవి బిరుదాంకితులు
శ్రీ సచ్చిదానంద గ్రంథాలయము.

## మనవి

అవతారిక వ్రాసినవారికి, నభిప్రాయములిచ్చినవారికిఁ గృతజ్ఞుడను. ముద్రణాదోషములతో బాటు నాదోషములనుగూడ క్షమింపవలెను. దయతోఁ దెలిపినచోఁ బునర్ముద్రణమున సవరించుకొనెద.

గ్రంథకర్త

కం॥ విఘ్నేశ్వరుఁడయి దుష్టకృ
తఘ్నస్వార్థకపటకలితప్రబలోద్యో
గఘ్నుఁడయి సుకార్యములకు
విఘ్నములనుఁ బాఁదో్రలు విభునిఁ దలఁచెదన్। 4

ఉ॥ ఉల్లమునందు భక్తిని ఘనోరగగేహజు, వ్యాసు, దండి, ధీ
వల్లభుఁగాళిదాసకవి, బాణుఁగవిత్రయభాస్కరేంద్రులం
బెల్లగు సోముఁ, బోతనను, బెద్దన, సూరన, మూర్తిఁ,దిమ్మనన్
మొల్లను, వేంకమాంబ మఱి పూర్వుల నిప్పటివారి నెంచెదన్। 5

కం॥ ఘనశంక లనేకము దీ
ర్చినమహితుఁడు దుగ్గరాజు సీతారామ
య్యనఁబడు మద్ధితుఁడగు సుకృ
తిని వేంకటపార్థసారథి కవులఁ దలఁతున్॥ 6

కం॥ తెలియని శబ్దార్థము పె
ద్దల నడిగి గ్రహింపఁబోక తప్పని ధృతితోఁ
బలుకుచు నితరులభావం
బులను హరించెడు కుకవులమూఁకఁ దెగడుదున్ 7

తే॥ రామకథ నిర్వచనముగ వ్రాయుదుఁబ్రీతి
పద్యమందున వేఱొక్కపద్యముండు,
నట్టి గర్భితములగు పద్యముల నెల్ల
వరుసతోడుతఁ జదువఁగా భారత మగు॥ 8

కం॥ కలియుగ మయిదువేల క
వల ముప్పది పయిని రెండవది, క్రీస్తుశకం
బొలయఁగఁ బదితొమ్మిది వం
దల ముప్పదియొకటిలో నొనరిచితిఁ దీనిన్। 9

తే॥ శ్రీనగమున కీశాన్యంబు, కృష్ణకు నను
త్తరదిశ, గుంటూరుజిల్లాను [illegible]

పేటశాలూరులోపల వెలయు రావి
పాడు స్వగ్రామమై నాకు వఱలుచుండు॥ 10

సీ॥ భారతీయుండ, బాపండ నాపస్తంబ
సూత్రుండఁ గౌండిన్యగోత్రజుండఁ,
బండితాగ్రేసరమండలమునకు న
త్యధికవిధేయుండ, నాఱువేల
వాఁడను; ముత్తాత వఱలును జలముల
రాజనం, గొండలరాజు తాత,
కొండలరాజునకుం జలమయ్య య
ప్పయ్య నాఁ గలిగి, రం దగ్రజుండు!

తే॥ చలమయకు సతి పిచ్చమ్మవలన నుద్భ
వించితిమి వేంకటప్పయ్య యేనును గురు
నాథ మనఁగ సుబ్బారావనంగ నం ద
రయు ద్వితీయుండ లక్ష్మీనారాయణుండ॥ 11

ఆ॥ వె॥ విమలకథలని, నవవిధమని, బుద్బుద
యశమునకు ఫిరంగినైనఁ దలఁచు
మాఱ్చు వీరవయసుతోనుంట, నీకష్ట
సాధ్యకృతికి సాహసము సలిపితి॥ 12

టీక॥ బుద్బుదయశమునకు.........వీరవయసు = షేక్సుఫియర్ ( Shakesphere ) యొక్క మానవుని సప్తవయసుల ( Seven ages of Man ) లో సూచింపబడిన నాలవవయస్సు॥

తే॥ ధరణిలోఁ " బ్రిమాదోధీమతామపి " యన
నల్పుఁడను మందమతిని నే ననఁగ నెంత
జలముల విడి పాలఁ గొను హంసలవిధమున
దప్పుల వదలి యొప్పులఁ దలఁప రయ్య॥ 13

—• షష్ఠ్యంతములు •—

కం॥ ధీరునకుఁ విదళితసం
సారునకు సమస్తవేదసారున కధికో

దారుణకును విమలశుభా
కారున కుపమానరహితగంభీరునకున్‌॥ 14
కం॥ ఘోరునకును నాగమసం
చారున కఘదూరునకును సద్భిద్గుణవి
స్తారునకును సకలకలుష
హారికి నినశశి ముఖాఖిలాధారునకున్‌॥ 15
కం॥ ఆయఖిలాధీశ్వరునకు
నా యమరేశునకు భక్తి నంకితమును నేఁ
జేయుదు; గర్భకవిత రా
మాయణభారత కథాక్రమం బెట్టిదనన్‌॥ 16

కథా ప్రారంభము.

రా॥ ఉ॥ శ్రీరమణీయమై (సిరులఁ జెంది వెలుంగును, జిష్ణుపీటి)నిన్‌
మీరాతి, యయోధ్య నా(గరిమ మించుచు బృథ్వి; నఖండహాస్తి)ర
క్షోరిగృహంబెయా(పురము అచ్చటిమేడలు వ్యోమమంటు) మేల్
తోరఁపుఖ్యాతితో (నగరిదూగుదులన్ హారినట్టితోఁడ) దాన్‌॥17
భా॥ తే॥ సిరులఁజెంది వెలుంగును జిష్ణుపీటి
గరిమ మించుచు బృథ్వి నఖండహాస్తి
పురము అచ్చటిమేడలు వ్యోమమంటు;
నగరిదూగుదులన్ హారినట్టితోఁడ॥ 17
టీక॥ రెంటికి, జిష్ణుపీటిన్=అమరావతిని, హారినట్టు=వైకుంఠము. రా॥
హాస్తిరక్షోరిగృహంబె=గజాసురుని విరోధియగు శివ[illegible]కైలాసము)
భా. హాస్తిపురము—హాస్తినాపట్టణము.
రా. సీ॥ మహితమారణమన్న మాటయే లేదన్నఁ
బాలబోన మనుమాటఁ దలఁచనేల
మత్తువస్తువులన్న మాటయే లేదన్నఁ
గలుషచిత్తులమాటఁ దలుపనేల

యాటచేటియలన్న మాటయే లేదన్నఁ
    దులువజాతలమాటఁ దెలుపనేల
మేటిస్వార్థంబన్న మాటయే లేదన్నఁ
    గులమతేర్ష్యలమాటఁ దెలుపనేల
తే॥ (పలువలుకు లేల యచటిజను లనయము స్వ
ధర్మపథమునున్ వదలక ధా)ర్మికని వయ
(ముల రెనసియుందురు; పురము లలిఁ గళకళ
లాడుఁ దోటలన్ సరసులతో) ఘమివ్రుల. 18

భా॥ కం॥ పలువలుకు లేల యచటిజ
నులనయము స్వధర్మపథమునున్ వదలక తా
మల రెనసియుందురు; పురము
లలిఁ గళకళలాడుఁ దోటలన్ సరసులతో॥ 18

రా॥ చం॥ మ్ముదముఁ జేలునా[నగరి భూపతి చీకుజనాలకాఁపు] పే
ర్చు; దశరథుండనన్ [వెలయుచున్ ధృతరాష్ట్రుడు భీమభీష్మ(మా
కదనమునందు నల్ [శరనికాయనపాయతఁ జక్కడంచె] ను
గ్రదనుజకోటులన్ [రిపుల రాజకులేంద్రు లరే యనంగ]నున్

భా. తే॥ నగరిభూపతి చీకు, జనాలకాఁపు
వెలయుచున్ ధృతరాష్ట్రుఁడు భీమభీష్మ
శరనికాయనపాయతఁ జక్కడంచె
రిపుల రాజకులేంద్రు లరే యనంగ॥ 19

టీ క॥ రా. చీకుజనాలకాఁపు- గ్రుడ్డిజనుల రక్షించువాఁడు, భా. చీకు
గ్రుడ్డి[illegible]డు జనాలకాఁపు-జనులరక్షించువాఁడు భీష్మ-(రా)భయంకర
ము( భా) భీ[illegible]వియొక్క ధృతరాష్ట్రుడు-(రా) రాష్ట్రముధరించినవాడు
రా. సీ॥ వ్రీతివెల్గ (ఘనుఁడు పాండునకూర్మ్యుఁడా
    జనవరాను)గ్రహమున కనేక
నృపులు చేచెదరు; లదినసామ్యాతే (ఘాంతు
    నెవ్వ దన్నునుఘలచొవ్వ విడఁడు;)
రమ (కోరి దిగ్విజయము చేసెఁ గుంతిను

(ద్ర) త్రోణివిభుముఖ్యరాజతతుల
మించి; కౌసల్య, సుమిత్ర, కైకయ (ధాత్రి
ధవళనయను గొనె దయితలుగను)
తే॥ సంతులేక విచారించె స్వాంతమందు
శ్రీ విచారించెను వశిష్ఠశిష్టుతోడ,
ఋశ్యశృంగుఁ దెచ్చె నిజపురికిఁ, బురజను
తెలుపు మిన్నందఁ బుత్రకామేష్టి సలిపె॥ 19

భా. తే. ఘనుఁడు పాండుసమాఖ్యుఁ డా జనవరాను
జుండు వెన్క దన్ననుకులచొప్పు విడక
కోరి దిగ్విజయముఁ జేసెఁ గుంతి, మద్ర
ధాత్రిధవతనయను గొనె దయితలుగను॥ 20

టీక. పాండుసమాఖ్యుఁడు= (రా) తెల్లనికీర్తిఁగలవాఁడు. (భా) పాండురాజు. అన్ననుకులచొప్పు= (రా) పలికిన మాటలదారి. (భా) అగ్రజునిమాటలదారిని.

రా. సీ. అట్లు సుతేష్టిఁజే(య, మునికరుణచేఁ బ
రముని, యుధిష్ఠిరు) రమ్యతేజు
నారాయణునిఁ బద్మనయను, ఘనశ్యాము
(సత్యధర్మగుణము శాంతరసము)
నుదుటు కనికరంబు (నుట్టిపడు మహాత్ము
నురుతుభాకాతుఁ గుం)భిరిపుదైర్య
లక్షణు, తాను, నల్లలితుఁ గౌసల్య ధృ
(తిఁ గనె ముదమునంద జగములని)
ఆ॥ పవలు చైత్రశుద్ధనవమిఁ గర్కటలగ్న
మునను భానువారమునఁ బునర్వ
సునను స్ఫూర్తితోడ నినుఁడుమధ్యఁ జరింప
నుష్ణవించె రాముఁ దుర్విభేద॥ 21

భా. ఆ. యమునికరుణచేఁ బరముని, యుధిష్ఠిరు,
సత్యధర్మగుణము శాంతరసము

నుట్టిపడు మహాత్మ, సుగుణభాకారుఁ గుం
తి గనె ముతము నంద జగము లన్ని 21

టీక. యుధిష్ఠిరుఁ (రా) యుద్ధమందు స్థిరమగువానిని,(భా)ధర్మరాజున్

రా. సీ. వి(బుధసందోహము వేడ్కఁ గూడెను; గనన్
మోదంబు గోబృందము)నయముగ
వె(సుధ నాశించెడువారు సంతసమువన్
శోభిల్లుచుండంగ, శో)భర హిత
శు(భధరాచక్రము చొక్క, మెల్లన జగ
త్ప్రాణుండు వీచెఁ;దా) కలశయ
ము (నధమ(శ్రేణియుఁ బొందు చుమ్మలికమున్
ఖ్యాతిన్ విడెం జెల్లుగ;) సువర్వ

తే॥ దుందుభులు మ్రోసె; దశదిశ లొండెఁ దెలివి;
నలరులజడి గురిసె; నాడి రప్సరసలు;
పాడె గంధర్వతతి; కూర్మితోడ నింట
గరుడపన్నగకిన్నరుల్ గంతు లిడిరి॥ 22

భా. మ. బుధసందోహము వేడ్కఁ గూడెను; గనన్ మోదంబుగోబృం
[దముగ్
సుధనాశించెడువారు సంతసమునన్ శోభిల్లుచుండంగ, శో
భధరాచక్రము చొక్క, మెల్లన జగత్ప్రాణుండునున్ వీచెఁ;దా
[illegible]మ(శ్రేణియుఁ బొందు చుమ్మలికమున్ ఖ్యాతిన్ విడెం
జెల్లుగన్. 22

టీక. సుగమము.

రా. చం॥ రణమునఁ జంపు నీ (మిగుల రాజితుఁడా కృతి నిన్ను భీమ,)
రావణు నని పొంగుచున్ (ఉదిరభవ్యతఁగూడి మరుద్వతంసు)లున్
దనులు మఖంబులం (దల్లఁచి నవ్యముఖంబు ముదంబు నొంది) మేల్
గణుతినిఁ జేయుఁగా, (ధృతినిఁ గాంచెను దత్సతి శివతోఁడి) యున్ 23.

భా. తే॥ మిగుల రాజిల్లు డాకృతి మిన్న భీము
రుచిరభవ్యతఁ గూడి మరుద్వతంసుఁ
దలఁచి నవ్యసుఖంబు ముదంబు నొంది
ధృతినిఁ గాంచెను తత్సతి తీవఁబోఁడి 23

టీక. రా. కృతి - నేర్పరి. భీమున్ - భయంకరుని, మరుద్వతంసులన్ - సురశ్రేష్ఠులు, దణులు - నేర్పరులు, తత్సతి - కౌసల్య, ధృతినిఁ గాంచెను - సంతస మందెను. భా. కృతిన్ - నేర్పరిని. భీము - భీముని, మరుద్వతంసు - వాయుదేవుని, తత్సతి - కుంతి ధృతిని - సంతోష ముతో, కాంచెను - ప్రసవించెను.

రా. చం॥ వరసుతజన్మమున్ (రమునఁ బ్రౌఢుఁడునౌ ధృతరాష్ట్రుఁ [డంత) జా
లరమణతో వినెం; (బలువలక్షణముల్ గలవారి నూఱు) నా
యురువిమలాత్ముఁడున్ (గురుసుయోధనముఖ్యులఁ గూర్మి [తోడఁ) గ
ల్గురసితుఁ డర్మిలిం (గనెను; గోర్కుల బీదలఁగాంచుఁ దన్పెఁ)దాన్ 24

భా. తే॥ రమునఁ బ్రౌఢుఁడునౌ ధృతరాష్ట్రుఁడంతఁ
బలువలక్షణముల్ గలవారి నూఱు
గురుసుయోధనముఖ్యులఁ గూర్మితోడఁ
గనెను; గోర్కుల బీదలఁ గాంచుఁ దన్పె 24

రా. టీక॥ పలువలక్షణముల్ ... యురువిమలాత్ముడున్ - దుస్స్వభావులనుఁ జంపు శుద్ధుఁడు. గురుసుయోధనముఖ్యుల - గొ[illegible]శ్రేష్ఠుల, అర్మిలిం గనెను - సంతస మందెను. (భా) [illegible]గురు - శతము, సుయోధనముఖ్యుల - దుర్యోధనుఁడు మొదలగువారిని, కనెను : కలిగినవాఁడయ్యెను.

రా. ఉం॥ అతిముదితాత్మయై (మఱియు నర్మిలిచే మిముముట్టి ధూని)శక
హితమతి కైకయున్ (శతక్రతుని గాంచెను జిష్ణునత్తఱి)లా

యుతుఁడగువాని, దా(రుణరిపూజ్వలభంజనరూతు తేజః) ప్ర
స్తుతు,భరతుణ్,మహా(విజయుశోభితలక్షణు,వేల్పులెన్నఁ)గన్

భా॥ గీ॥ మరియు చర్మిలిచే మిసుముట్టిరూని
శితశరేక్షణ గాంచెను జిష్ణుసత్క
రుణ, రిపూజ్వలభంజనరూతు తేజ,
విజయు, శోభితలక్షణు, వేల్పులెన్న 25

టీక. జిష్ణుసత్కళాయుతుఁడగువాని — జయశీలుని తేజముగలవాని, మహావిజయశోభితలక్షణు - గొప్పగెలుపుకాని యొక్కప్రికాశమాన మగు స్వభావముగలవానిని, భా. అనిశితశరేక్షణ - కుంతి, జిష్ణుసత్కరుణ - దేవేంద్రుని దయవలన, విజయు - అర్జునుని.

రా॥ సీ॥ రాజీవపత్రనేత్ర సుమిత్రయును (బాధ
భవ్యతఁగాంచె బ్రిభాయుతుని వ)
లరుసుర(కులుని వలఘుగతిముదితకు
వలయు సహ) ప్రాంశుభాసమాను,
లక్ష్మణు, శత్రుఘ్ను, లాలితభూ(దేవు,
దివ్యరుచికలితు; ధృతినినెన్ని)
కనునెక్క మోహనాకారులునౌ (స్వర్గ
-వైద్యులమూాద్రి సుపర్వవినుత)

గీ॥ లలితరూపులయిన లక్ష్మణశత్రుఘ్ను
లుద్భవంబు నొంది రుర్విఁ బగలు;
వరుసఁ జక్రశేషపాంచజన్యములై త
భరతుఁడు సుమిత్రికందులయ్యె॥ 26

భా॥ గీ॥ బాధభవ్యతఁ గాంచెఁ బ్రభాయుతుని వ
కులుని, వలఘుగతిముదితకువలయు, సహ
దేవు, దివ్యరుచికలితు ధృతినినెన్ని
స్వర్గవైద్యుల, మాద్రి, సుపర్వవినుత॥ 26

టీక. రా. అలరుసురకులుని-సంతోషించుచున్న దేవతానసమూహముగ

లవానిని, సహస్రాంశుభాసమాను - సూర్యతేజస్సుగలవానిని, స్వర్గవైద్యులమాద్రి - అశ్వినులవలె. భా. మాద్రి - మాద్రీదేవి, స్వర్గవైద్యుల - అశ్వినులను, ఎన్ని - ప్రార్థించి.

రా॥ చం॥ జగతివిభుండు సద్(హసనసంయుతుండై ధృతి నంతమాద్రి) నె
ప్డుగనఁగలేదనెన్; (మమతఁబొందె, మహీసురుమాట నాత్రె)న్నా
వగయనె భూపుఁడున్ (దణీయుఁ బాండుసమాఖ్యుఁడు;
తత్సుకీర్తి)తో
నగరియువెల్గె, రే(యతివ నాధుని రాజును హాళిఁగూడె) నాన్॥ 27

భా॥ గీ॥ హసనసంయుతుండై ధృతి నంత మాద్రి
మమతఁబొందె, మహీసురుమాటనాత్రె
దణీయుఁ బాండుసమాఖ్యుఁడు; తత్సుకీర్తి
యతివ నాధుని రాజును హాళిఁగూడె॥ 27

టీక. రా. ధృతినంతమాద్రిన్ — అంతకు సామ్యమ్ముగు సంతసమును, భా. అంతన్ - అంతట, మాద్రి - మాద్రీదేవిని, అత్రె - చనిపోయెను పాండుసమాఖ్యుఁడు - (రా) తెల్లనికీర్తిగలవాఁడు. భా. పాండురాజు, తత్సుకీర్తి - ఆ శ్రేష్ఠమగుకీర్తిగలదియగు, అతివ - స్త్రీ, అనఁగా- మాద్రి, రాజును - (రా) చంద్రుని, (భా) పాండురాజున్.

రా. చతుర్విధకందము. సీతిగ దివిజవితానము
భాతిన్, ఘనకేసరిశిశువర్గంబనఁగా,
భూతికరుణాత్ములనియెడు
ఖ్యాతిన్, జననాధసుతనికాయము దనరెన్ 28

భా. కం॥ ఘనకేసరిశిశువర్గం
బనఁగా, భూతికరుణాత్ములనియెడు ఖ్యాతిన్,
జననాధసుతనికాయము
దనరెన్ సీతిగ దివిజవితానము భాతిన్॥ 28

'భూతికరుణాత్ములనియెడు' నుండియు, 'జననాధసుతనికాయము' నుండియుఁ, జదివినను కందపద్యములు వచ్చును. టీక సుగమము.

చం॥ రా. అతులితవీర్యులై (పెరిగిరా ప్రభుపుత్రులు వీఁక గూడఁ;) బ
ద్వతధృతిఁ దండ్రి తా (నధికవైరిచమూదధిహారికుంభ) జుం
డతిధృతిఁ జూడ, రా(జదయనందుచు నేర్చిరి శాస్త్రవిద్య) లం
డతమగు నేర్పుతో; (నవనిఁ దామరతంపరలైరి చాల)గన్॥ 29

భా. గీ॥ పెరిగిరా ప్రభుపుత్రులు వీఁక గూడఁ;
నధికవైరిచమూదధిహారి కుంభ
జదయ నందుచు నేర్చిరి శాస్త్రవిద్య;
నవనిఁ దామరతంపరలైరి చాల॥ 29

టీక. రా. అధికవైరిచమూదధిహారికుంభజుండు — గొప్ప శత్రుసేనాసముద్రమునకుమనోజ్ఞుఁడగు నగస్త్యుని బోలువాఁడు.

భా. అధికవైరిచమూదధి - గొప్పశత్రుసేనాసముద్రమును, హారి - హరించువాఁడగు, కుంభజదయ - ద్రోణుని దయ.

రా. సీ॥ అభివృద్ధినొందెఁ జేయఁగ దైత్యులు (కడుగ
ను నసూయ, దుర్యోధనుఁడునుఁ బాండు)
యశుఁడగు రాముండు; కుశికతనూజుండు
పగను మారీచసుబాహుముఖ్య
ఘననిజయజ్ఞవిఘ్నకరదితి(సుతుల
పైఁ గని, యేగి, భూపతిని, వారి)
గూల్ప రాఘవుఁ (బంపఁ గోరెఁ బవిత్రంబు
వారణావ)లి సింహావగ్గ మాడు

ఆ॥ కొ[illegible]పవత (తతలమునకు; వీఁ గియునుఁదు
దఁనను[illegible]ంగ[illegible]సియుకొని నితండ
తులితుఁడుక్కుతునక నిలువు నీరగుటేల
యనుపుమని వశిష్ఠుఁడు నుడువంగ॥ 30

భా. గీ॥ కడుగను నసూయ దుర్యోధనుఁడునుఁ బాండు
సుతులపైఁ గనియేగి, భూపతిని వారిఁ

బంపఁ గోరెఁ బవిత్రంబు వారణావ
తతలమునకు; వీఁగియును దుద ననుపంగ॥ 30

టీక. రా దుర్యోధనుఁడు - యోధులకు భేదింపరానివాఁడు, పాండు యశుఁడు - తెల్లనికీర్తి గలవాఁడు, వారణావళి...తతతలమునకు - జాతి వైషమ్యములను గూడ మఱచి, విశ్వామిత్రుని ప్రభావముచేత, నతని యాశ్రమమందు, నేనుఁగులు సింహములాడు కొనుచున్నవనుట.
భా. పాండుసుతులపైన్ - పాండవులపై, వారణావతతలమునకు - వారణావతమను స్థలమునకు.

రా. చం॥ ప్రణుతులఁ జేయుచున్ (నృపతిపాండుసమాఖ్యజు లెచ్చు
రామ) ల
క్ష్మణులు నొనర్చి నన్ (మృదుల మంజులగాత్రిసమేతమాత)లం
గణుతి, మునీంద్రుతో (నెనసి కాండములం గొని యేగి రంతఁ) ద
త్తృణమున; గంగనుం (గనిరి తమ్మోపజు లేర్తెఱగా మొదంబు) నన్॥ 31

భా. గీ॥ నృపతి పాండుసమాఖ్యజు లెచ్చురామ,
మృదులమంజులగాత్రిసమేత, మాత,
నెనసి, కాండములం గొని, యేగిరంతఁ
గనిరి తమ్మోపజు లేర్తెఱగా ముదంబు॥ 31

టీక. నృపతి పాండుసమాఖ్యజులు - (రా) రాజునకు, తెల్లని కీర్తి గలవాని (దశరథుని) కుమారులు. (భా) పాండురాజపుత్రులు.

రా. చం॥ వస నది దాటి తన్ (మృదుసుభద్రియశస్కులు
హెచ్చులక్ష్య) డన్
మనలు, చెడారియా (నెలవు నవ్యముదంబు జనించుచుండఁ) గా
ననురనుఁ దాటకం (గనిరి; వాలిని దానిని గండడైన) రిన్
వెస శరవహ్నివై (రికృతిభీముఁడు రాముఁడు ప్రీతిఁగాల్చెఁ)
దాన్॥ 32

భా. గీ॥ మృదుసుభద్రయశస్కులు హెచ్చులక్ష
నెలవు నవ్యముదంబు జనించుచుండ

గనిరి; వాలినిఁ దానిని గండడైన
రికృతి భీముఁడు రాముఁడు ప్రీతిఁగాల్చె॥ 32

టీక. రా. వైరికృతిభీముఁడు - నేర్పరులగు శాత్రవులకు భయంకరుఁడు. (భా.) సరికృతి - సరియగు నేర్పరి. రాముఁడు - రమ్యముగా నుండువాఁడు. హెచ్చులక్క నెలవు - గొప్పలక్క యిల్లు.

నిరోష్ఠ్యము.

రా. గీ॥ (జతఁగనని దిట్ట లాలలి తతి నెఱసరి
వాలి దాని దాటెరి; లలి నాయతధృతి
రహినిఁ జనిరి సంతతసాళరధరణి కధి
కతతతలి కచటన్) జాల ధృతినెలసిరి॥ 33

భా. కం॥ జతఁగనని దిట్ట లాలలి
తతినెఱసరివాలి దాని దాటెరి; లలి నా
యతధృతి రహినిఁ జనిరి సం
తతసాళరధరణి కధికతతతలి కచటన్ 33

టీ. ఆలలితతిన్ - అసాగసైన సమయమందు, నెఱసరివాలి - ఎక్కువయుక్తముగాను ప్రీతితోఁడ, లలిన్ - వికాసముగా, నాయతధృతిన్ - ఎక్కువధైర్యముతో, రహిని - రంజనముగా, సాళరధరణికి - రాక్షసులతో గూడినభూమికి, రా. ధృతినెలసిరి - ప్రీతిసందిరి, దాని - (రా) తాటక, (భా) లక్కయిల్లు.

రా. సీ॥ విహగనాధుఁడు శతుప్రభీముఁ డచ్చయి కెడ
పి పరు మహాహి డింభదుపడక మిగు
[illegible]రాముఁడు దీప్చుఁ బగసని ముని గొన
(బుధ్ధృతిఁ గూడెఁ; దదనుజధృతిఁ గాంచె);
జటికోటి భూపాగ్రసత్పుతుఁగని యేక
చక్రపురమ మాధు) రిక్రమనుచ
రితదూరఖలులన్ హరింపదె పెక్కు మూ
ఋతులను రఘువరుని ప్రతాప

గీ॥ మొక్కడే చాలు దనుజుల నుడుప ననెను
దారిలోఁ; గూర్మిఁ జూచి రా తాపసాధి
కని(కరము నృపజులు ద్విజగతుల; నెఱపఁ)
గ నవము ముని చెలువచ్చి రసురు లపుడు॥ 34

భా. ఆ॥ భీముఁ డెచ్చయి కెడపి పరు మహాహిడిం
బు ధృతిఁగూడెఁ దదనుజ ధృతి; గాంచె
సత్సుతుఁ; గనియేకచక్రపురము మాధు
కరము నృపజులు ద్విజగతుల నెఱప॥ 34

టీక. రా. శత్రుభీముఁడు - విరోధులకు భయంకరుఁడు, మహాహిన్ - గొప్పపామును, గొనబుధృతిన్ - మనోజ్ఞమగు సంతసమును, తదనుజ ధృతిన్ - అతనితమ్మునియొక్క (లక్ష్మణుని) ధైర్యమును, యేకచక్రివునము - ఒక్క (విష్ణు) చక్రముయొక్క భాగ్యమే. ద్విజగతులన్ - పక్షులగమనమును, భా. హిడింబు - హిడింబుఁడనురాక్షసుని, తదనుజన్ - అతనిచెల్లెలగు హిడింబిని, ద్విజగతులన్ - బ్రాహ్మణులవిధములో, సత్సుతు - ఘటోత్కచుని.

రా. ఉ॥ ఔచితి గాముఁడున్ (మఱిసియచ్చటిశిష్టులు పొంగఁగా బ)లున్
నీచు సుబాహు సో(కు ధరణీజనదూరునిఁ గూర్చిఁ గూల్చె;)మా
రీచునిఁ జిమ్మె సద్(ధృతి వరించి కడున్ గడితేటి భీముఁ)డై
ప్రోచె సవమ్ము, గో(డడరుఁ బొందుచు దుష్టజనాళి కుంద)గన్

భా. గీ॥ మఱిసి యచ్చటిశిష్టులు పొంగఁగా బ
కు ధరణీజనదూరునిఁ గూర్చిఁ గూల్చె;
ధృతి వరించి కడున్ గడితేటి భీముఁ
డడరుఁ బొందుచు దుష్టజనాళి కుంద॥ 35

టీక. రా. భీముఁడై - భయంకరుఁడై, సోకు - రాక్షసుని.

రా. ఉ. పొంగు చొనర్చి సద్(ధృఢులు భూపసుతుల్ సుధృతిన్
(మహాద్రు) లై
భంగముఁ దాపసా(పద,నృపాలజు పారిజపాద కృష్ణ) సా

రంగమృగాక్షియా(రమణి రమ్యశుభాస్యతిరస్కృతేందు) ధీ
రాంగన జానకీ(ప్రథిత వాల్లకపాణి వివాహ మంచు) నుఁ 36

భా. గీ॥ దృఢులు భూపసుతుల్ సుధృతిఁ మహాద్రు
పదనృపాలజ వారిజపాద కృష్ణ
రమణి రమ్యశుభాస్యతిరస్కృతేందు
ప్రథితవాల్లకపాణివివాహమంచు॥ 36

టీక. రా. సుధృతిఁ మహాద్రులై - ధీరత్వమున గొప్పపర్వతములఁ బోలినవారై; కృష్ణసారంగమృగాక్షి - కృష్ణసారంగమువంటి కన్నులు గలది, భా. ద్రుపదనృపాలజ - ద్రౌపది; కృష్ణ - కృష్ణయనుపేరుగలది.

రా. గీ॥(విని యతిసునృపజులు విరివిధృతిఁదలఁచి
రావివాహమునకుఁ బోవ వాళి;) ధీమ
(తల్లితోడుత ఘనతనుఁ దవరి చనిరి
కానఁ గూర్మితోడఁ గలయఁగనుచుఁ) గనుచు॥ 37

భా. ఆ॥ విని యతి సునృపజులు విరివిధృతిఁ దలఁచి
రా వివాహమునకుఁ బోవ వాళి;
తల్లితోడుత ఘనతనుఁ దవరి చనిరి
గానఁ గూర్మితోడ గలయఁగనుచు॥ 37

టీక. యతిసునృపజులు - (రా) యతి - ముని, సునృపజులు - శ్రేష్ఠులగు రాజకుమారులు, (భా) అతి - అధికమగు, సు - శ్రేష్ఠులగు, నృపజులు - రాజకుమారులు, ధీమతల్లి - శ్రేష్ఠమగుబుద్ధి.

రా. సీ॥ [illegible]శోభను నతిమోద మొసఁ (గంగఁ
గన్నులార దణులు గాంచి; రచట)
నంబురుహాహితాన్వయాంబుధిశశి (భూరి
వీరుండు జిష్ణు డంగారపర్ణ)
సదృశశాస్త్రాఢ్యుండు జన్మజారుచిర (శక్తిఁ
జాలఁ గామించెఁ బ్రచండవుఁ దమి)

గౌతమాశ్రమము డగ్గరి రంతట (వనల
సానందభరితాత్ము లయిరి వారు;)

ఆ॥ రామచంద్రపాదరజము సోఁకినయంత
శాపవశముచేతఁ బట్టు ఱినయ
హల్య పూర్వరూపమందె నచ్చోటువాసి
వారు మిథిలతోఁట జేరి రచట॥ 38

భా. గీ॥ గంగఁ గన్నులార దనులు గాంచిరచట
భూరివీరుండు జిష్ణుఁ డంగారవర్ణ
• శక్తిఁ జాలఁగా మించెఁ బ్రచండవుఁదమి
వనలసానందభరితాత్ము అయిరి వారు॥ 38

టీక. రా. అంగారవర్ణము - అగ్నిశకలములు గలయాకు (ఎఱ్ఱనివి) జిష్ణుఁడు - (రా) జయశీలుఁడు భా. అర్జునుఁడు, తమి-(రా) కోరిక, (భా) రాత్రి.

ముక్తపదగ్రస్తము.

రా. సీ॥ ఘనఘనశ్యాము రాఘవునిఁ గాంచి (ముదిసి
పురివిప్పియాడు కోమరునమిళ్ల)
నమిలియాట కనుగుణ్యపుటలల, (నలల
యుం దుయ్యేలల నూఁగు నంచలగమి,)
నంచలగమి వెక్కిరించు చుఱికి (వల్ల
రుల లీలనూఁగెడు బళితకపులఁ)
గపితతిచేత మెక్కఁబడెడు పండ్లనుఁ (బండ్ల
బరువునఁ దలలను వంచు చెట్లఁ)

గీ॥ జెట్లకొమ్మల నెఱుపుఁజేసెడు చివుళ్లఁ,
జివుళులఁ దిని క్రొవ్వి పలుకు చిలుకపౌజు
చిలుకపౌజున కులుకు జింకలఁగలిగి క
ర మలరించె నారామ మారామముఖుల॥ 39

భా. గీ॥ మూరిసి పురివిప్పియాడు కొమరునెమళ్ల
నలల యందుమ్యోలల నూఁగు నంచలగమి
వల్లరుల లీలనూఁగెడు బలితకపులఁ
బండ్లబరువునఁ దలలను వంచుచెట్లు॥ 39

టీక॥ సులభము. భారతమందుఁ గ్రింది పద్యమున కన్వయము.

అష్టవిధకందము.

రా. ద్రుమములఁ గరులనుఁ వెలికుసు
మములను ఘనతఁ గుశలతను మఱి మఱికనుచున్
సమరహితరమను ఖలముల
గుములయి తనిసి రతులితులు గురుమతివినుతుల్॥ 40

భా. వెలికుసుమములను ఘనతఁ గు
శలతను మఱి మఱి కనుచును సమరహితరమన్
ఖలముల గుములయి తనిసి ర
తులితులు గురుమతివినుతులు ద్రుమములఁ గరులన్॥ 40

టీక. సులభము. ఇట్లే "ఘనతఁ గుశలతను" నుండి మఱిమఱి కనుచును" నుండి "సమరహితరమను" నుండి "ఖలముల గుములయి" నుండి. "తనిసి రతులితులు" నుండి, "గురుమతివినుతులు" నుండి చదువవచ్చును. అప్పకవీయమున నష్టవిధకందమున కీయఁబడిన లక్ష్యప్రకారము, "కనుచున్ - కనుచును గాను, రమన్ - రమను గాను, గుములై - గుములయి గాను, వినుతుల్ - వినుతులుగాను రావలెను.

రా. గీ॥ పరఁగఁ జిగురాకుచేతుల గురువుగ శ్రమ
వాయ విసరెఁ గొమ్మలపరి; భాసురముగ
ద్విజరవముల మధ్య రహిన్ నృపజులపయి ర
మ నలరులు నొలసెన్;) హెచ్చు మంజులతలు॥

భా. కం॥ పరఁగఁ జిగురాకుచేతుల
గురువుగ శ్రీమవాయ విసరెఁ గొమ్మలపరి; భా

సురముగ ద్విజరవముల మ
ధ్య రహిన్ స్ఫజులవయి రమ నలరులు నొలసెన్॥ 41

టీక. రెంటికి సమము. చిగురాకుచేతులన్ - చిగురు లను చేతులతో, కొమ్మలపరి - వృక్షశాఖలగుంపు, ద్విజరవముల - పక్షులపలుకుల, అలరులు - పుష్పములు, మంజులతేలు - సుందరములగు తీవలు. చిగురాకుచేతుల - చిగురులవంటి చేతులతో, కొమ్మలపరి - స్త్రీసమూహము, ద్విజరవములు - బ్రాహ్మణుల పలుకులు (మంత్రములు) అలరులు నొలసెన్ - సంతోషములు వ్యాపించెను, మంజులతేలు - మనోహరత్వములు. అని అర్థాంతరము. ముందుకాఁబోవు వివాహమునకు సూచనలు.

అచ్చతెలుగు.

రా. చం॥ పనిపడి దిట్టలై (పరఁగ వచ్చిరి వీటికి వారు రాచ) చె
లొప్పనరెడుకీవి రా (కొమరు; లొక్కొ కకండును గొప్ప వేడ్క) బెం
డ్లినగుడు నేన బల్ (గొనబునేర్పరి, పెంకిలికూతు రన్న) నం
చనుకొన హెచ్చునై (పొరలి హాళియుఁగోరిక వుట్టుచుండఁ) గన్॥ 42

భా. గీ॥ పరఁగఁవచ్చిరి వీటికి వారురాచ
కొమరు లొక్కొకకండును; గొప్పవేడ్క
గొనబునేర్పరి పెండిలికూఁతురన్న
పొరలి హాళియుఁగోరిక పుట్టుచుండ॥ 42

టీక. పెండిలి కూతురన్న - (రా) సీతయనిన చో (భా) ద్రౌపది కన్యయందు. భారతమునఁ గ్రిందిపద్యమున కన్వయము.

రా. చం॥ జనకుఁడు సాధుఁడున్ (నుడివె ఱ్ఱాపజులార వినుండు చోటు)దా
లునిరిపువిల్లుబెం (గుటిని లోఁగొని, బీరము గూడ, దాని) ఫు
ల్లనలిననేత్రకై (నయనలక్ష్యము వేడుక నాటఁగొట్టు) చుం

దనరుచు నెక్కుడున్ (మెఱసి, తద్బలుడుం గొను మించుబోఁడి)
నిన్॥ 43

భా. గీ॥ నడిచె త్ర్యమ్నజులార వినుండు చోఱ
కుటిని లోఁగొని బీరము గూడ దాని
నయనలక్ష్యము వేడుక నాటఁగొట్టు
మెఱసి తద్బలుఁడుం గొను మించుబోఁడి॥ 43

టీక. రా. చోఱడాలుని - మీనకేతనుఁడగు మన్మథునియొక్క -
రిపు - శత్రుఁడగు శివుని, లక్ష్యము - గుఱి, వేడుకనాటఁగొట్టుచున్ ,
(రా) సంతోషమును నాటురీతినిఁ గొట్టుచు. భా. వేడుకనాటు - సంత
సము నాటగా, దానినయనలక్ష్యము - చేపకన్నును గుఱిని - కొట్టు.

రా. చం॥ అన (విని, పోరి, కొందఱు వరావనినాథజు లోడి, సిగ్గుపైఁ
గొనఁ, జనిరం) తటన్ విడచి; కొందఱు గుంపిరి కొందలాన; బల్
ఘన (తనుఁ గొందఱాసనములన్ ఘనభాతినినుండి రంతగ్ర
మ్మనలుకునన్;) రొదంగనక పోయిరి కొందఱు బుద్ధిమంతులున్॥ 44

భా. కం॥ విని, పోరి, కొందఱు వరా
వనినాథజులోడి సిగ్గుపైఁగొనఁ, జనిరం
తనుఁ; గొందఱాసనములన్
ఘనభాతిని నుండిరంత గ్రమ్మనలుకునన్॥ 44

టీక. సులభము.

రా. చం॥ ఇనసమతేజుఁడన్ (బిరుదు సేనును నోడితి, భీమమాయ) నుఁ
కుఁడు కూర్రుఁడుం (గుమతి సల్పెనటంచునుఁ గొంద
ఱంత)టం
బనివడికిన్కతో (ననిరి; పల్కిరి కొందఱు నల్క నీపె) యే
ఘనుఁడగునాకునుఁ (గతియొకొ కాక వివాహముకాదె యంచు)
నున్॥ 45

భా. గీ॥ బిరుదు సేనును నోడితి, భీమమాయఁ
గుమతి సల్పె నటంచునుఁ గొంద ఱంత

ననిరి; పల్కిరి కొందఱు నల్కనీపె
గతియొ? కాక వివాహము కాదె యంచు॥ 45

టీక. సులభము.

రా. చం. ఎనయు నభావముల్, (రమణులెందు ననర్థకరంబు లంచు(ం)బొం
దినవిరక్తిచే (ధృతినిఁ దృప్తినిఁ గొందఱు దెచ్చికొంచుఁ)బా
యనిగరిమంబులం (దలఁచిరప్పుడు; నక్కయుద్రాక్షపండు) లూ
నినతమిఁ గోరి లీ (లఁగొననేరక యాత్మఁదలంచు రీతి) గన్ ॥46

భా. గీ॥ రమణులెందు ననర్థకరంబులంచు,
ధృతినిఁ దృప్తినిఁ గొందఱు దెచ్చికొంచుఁ,
దలఁచిరప్పుడు; నక్కయుద్రాక్షపండు
లఁ గొననేరక యాత్మఁదలంచురీతి॥ 46

టీక. సులభము.

రా. చం॥ అవని నికెవ్వరున్ (వలదు యత్నముసేయఁగ, వట్టిమాయ)గె
లెవరు జయింతురో (యెవరికెయ్యది ప్రాప్తమొ యేఁడుసెప్ప)స
ర్వవిదుఁడు దక్కఁగా? (ధరణి వానిది కానిది దక్కుదేల) యీ
తివ్రుటలాడుటల్ (నవ్వులు దీనికిలోఁబడ నానలేక) యున్ 47

భా. గీ॥ వలదు యత్నముసేయఁగ వట్టిమాయ
యెవరి కెయ్యదిప్రాప్తమొ యేఁడుసెప్ప
ధరణి వానిదికానిది దక్కుదేల
నవ్వులు దీనికి లోఁబడ నానలేక॥ 47

టీక. సులభము.

రా. గీ॥ (అని యనిరి కొందఱున్నృపజు లనుకొనిరెద
గెలువరేరు వంచును మఱిగెల్చినభుజ
బలమున నఱియందునఁగూల్చి పడఁతిఁగొనెద
మనుచుఁ గొందఱువే) నతిఁగనుఁగొనుచును 48

భా. కం॥ అనియనిరి కొందఱు నృపజు
లనుకొనిరెద గెలువరేరు నంచును మఱి గె
ల్చిన భుజబలమున ననియం
దునఁ గూల్చెవడఁతిఁ గొనెద మనుచుఁ గొందఱువే 48

టీక. సులభము.

రా. ఉం॥ గ్రవిసమతేజుఁడున్ (బలుఁడు రాముఁడు జిష్ణుఁడువచ్చి,వీఁక) బ
ల్మిమెఱయ శౌర్యముం(బఱువ లీలనుఁద్రుంచెను బంచసాయ)కా
రివిలునుఁదోవసా(కముల శ్రీ) మెఱయందెఱగంటిమిన్న)లు
బ్బ, వఱలుసిగ్గుతోఁ(దలలువంచఁగఁ దక్కిన ధాత్రిపాళి)యున్

భా. గీ॥ బలుఁడు రాముఁడు జిష్ణుఁడువచ్చి వీఁక
బరువ లీలనుఁద్రుంచెను బంచసాయ
కముల శ్రీ మెఱయందెఱగంటిమిన్న,
దలలవంచఁగఁ దక్కినధాత్రిపాళి॥ 49

టీక. పంచసాయక - మన్మథునియొక్క, అరి - శత్రుఁడగు శివుని జిష్ణుఁడు - (రా) జయశీలుఁడు. (భా) అర్జునుఁడు, తెఱగంటిమిన్న. (రా) దేవత, (భా) చేప. రాముఁడు - (భా) రమ్యమగువాఁడు.

రా. చం॥ అదరెను భూమియున్,(మలయుచబ్ధులు ఘూర్ణిలె, క్ష్మాధ [రాళి) యుం
జెదరెను,దారకల్(కదలె, జిష్ణుఁడు రాముఁడఖండభీము) వి
ల్లుఁదవదు భీష్మమా(కడిమెలోఁబడఁజేయఁగఁ, గర్ణశల్య)మా
[illegible]దలయింవగా(నృపుల, రోదసిఁబూజసినింపుచుండఁ)గన్

భా. గీ॥ మలయు నబ్ధులు ఘూర్ణిలె, క్ష్మాధరాళి
కదలె, జిష్ణుఁడు రాముఁడఖండభీము
కడిమలోఁబడఁ జేయఁగఁ గర్ణశల్య
నృపుల, రోదసిఁ బూజది నింపుచుండ॥ 50

టీక. జిష్ణుఁడు - (రా) జయశీలుఁడు (భా) అర్జునుఁడు.

భీము-(రా)శివుని, (భా) భీముని, కర్ణశల్య - (రా) చెవులకు బాణము లబోలిన, (భా) కర్ణుఁడు, శల్యుఁడు.

పుష్పమాలికాబంధము.

జ  ల  వే  ము  ము  మా
జలిగా వెసలోచనదా నతిక్రాల్ మనవై చెను ఖ్యా
మీ  ద్బి  యా  దా  ల్ల  గా .
స  ధృ  నా  వ  రి  పూ
తిరహిఁ నతియుఱ్ఱునతో నరతఁ బొనఁదావులనుఁ
మఁ  న్బ  నా  పీ  ల్వు  మా

రా. చం॥ జలిజలి మీఁలిఁగా(వెస లనద్బిసలోచన వే నయాన()దా
నతిముతిఁదాతిక్రాల్ (మనమునల్లనవై చెను మానుగాన)ఖ్యా
తిరసరమన్ రహిన్(నతిధృతిం బతియుఱ్ఱున నాన నానఁ)తో
నరవరవీరతం(బొనరి నల్వునఁదావుల పూలమాల)నున్ 51

భా. గీ॥ వెసలనద్బిసలోచనవే నయాన
మనము నల్లన వైచెను మానుగాను
నతిధృతిం బతియుఱ్ఱుననాన నానఁ
బొనరి నల్వునఁ దావులపూలమాల॥ 51

టీక. రెంటికి. నయాన - నయముతో, పతియుఱ్ఱున - భర్తకెదురసీమన, ఆనఁ - తగులునట్లు, రా. నతిఁ - మ్రొక్కుతో (భక్తిభావముతో) ధృతిఁ - సంతోషముతో, భా. అతిధృతిఁ - ఎక్కువసంతోషముతో, నరవరవీరతన్ - (రా) రాముని యొక్క యు[illegible]హాముచే

రా. సీ॥ వచ్చిరి దశరథపతియు నా(పాండున
మాఖ్యునిపుత్రులు) మహిఁబిభరత
శత్రుఘ్నులునుఁ; (మెంఁనుసరినిఁ గొనిరి కృష్ణ
మృగనయనను వ్యా)శిమేదకజట
నుర్వీజ రఘురాముఁమార్మిళఁ లక్ష్మణుం
డును మాండవిఁ భరతుఁడు శ్రుతకీర్తి

శత్రుఘ్నుఁడు శుభాల్పన గురుండనలసుంద
నఁ; బిలువఁగ ధృతరాజ్యబలునికోడు
గీ॥ కులనుఁగోడండ్రఁగన నొండొరుల సతులఁ; నృ
పజులు కోసలరాష్ట్రిండు స్వపురికిఁజని,
రలరుచు రుచిరగతిలోడ సులువుగ భృగు
ర్వామగర్వంబు దారిలో రాముఁడడఁచె॥ 52

భా. క౦॥ పాండుసమాఖ్యునిపుత్రులు
మెండుసరినిఁ గొనిరి కృష్ణ మృగనయనను వ్యా
సుండనఁ; బిలువఁగ ధృతరా
ష్ట్రిండు స్వపురికిఁజని రలరుచు రుచిరగతిలో॥ 52

టీక. పాండుసమాఖ్యుని - (రా) తెల్లనికీర్తిగలవాని, (భా) పాండురాజుయొక్క, కృష్ణమృగనయనను - (రా) కృష్ణమృగమువంటికన్నులుగలదానిని, (భా) కృష్ణన్ - ద్రౌపదిని, మృగనయనను - లేడివంటి కన్నులుగలదానిని. శుభాల్ - (రా) శుభవచనములు, అన - (రెంటికి) చెప్పఁగా.

రా. సీ॥ ప్రాయక మించఁగా స్వపురి వారు కడున్, రు
చిస్ఫూర్తియుక్తుఁడై శ్రీఁదలంచె
న్యాయపథానమిష్ణ జననాయకుఁడుం గృ
తిస్తుత్యుఁడర్థ భూప్రకలితారి
ధీయుతరాజుగా ధృతి యుధిష్ఠిరు సన్మ
తిశ్రేష్ఠు రామునిన్ ధీరగుణుని,
గ; దుష్టులున్ సిలుగుఁజెందిరి దుష్టి
తిక్షోభఁగూమునగ; డిట్టయయి శు
గీ॥ భస్యశీఘ్రమ్మని నృపుండు పలికెఁ బురజ
ములకుఁ దనకోర్కెఁ; వారియనుజ్ఞఁబొందె;
నొకటి తానెంచ దైవమింకొకటి సేయుఁ
గాని యద్దానిఁగలఁగాంచఁ గలఁడెవఁడుఁ॥ 53

భా. ఉ. పాయకమించఁగా స్వపురి వారు కడున్ రుచి,స్ఫూర్తియుక్తుఁడై
న్యాయపథానమిన్న జననాయకుఁడుం గృతి స్తుత్యుఁడర్థభూ
ధీయుతరాజుగా ధృతి యుధిష్ఠిరుసన్మతి శ్రేష్ఠురామునిం
జేయఁగ, దుష్టులున్ సిలుగుఁజెందిరి దుస్థితిక్షోభఁగూడుచున్॥

టీక. రుచిస్ఫూర్తియుక్తుఁడై - ఒకేసమాసము. (భా) రుచిన్, స్ఫూర్తియుక్తుఁడై - ఇట్లే, కృతిస్తుత్యుఁడు, సన్మతిశ్రేష్ఠుఁడు, దుస్థితిక్షోభ - ఒకేసమాసము. (భా) వేఱుపదములు. ఇందు, సీసోత్పలమాలలలో నాలుగు పాదములయందు 15 వయక్షరములగు ,చి' ,తి' ,తి' లు రామాయణార్థమున గురువులుగాను, భారతార్థమున లఘువులుగానున్నవి. కృతిస్తుత్యుఁడు - (రా) కృతులవలన స్తుతింపదగువాఁడు. (భా) కృతియు, స్తుత్యుఁడు. అర్థభూతికలితారి - (రా) తునుకలయిన యైశ్వర్యముకల శత్రువులుగలవాఁడు. అర్థభూధీయుతరాజు - (భా)సగమురాజ్యమునకుబుద్ధిప్రావీణ్యముగలరాజుగాన్ యుధిష్ఠిరు-(రా) యుద్ధమందు స్థిరముగువానిని రామున్ - (భా) రమ్యముగువానిని.

రా. సీ॥ ఇల(ఖ్యాతి, స్ఫూర్తియుతైణలోచనల సత్
క్షమాపాత్మజల్ గొప్పగా) గొని ప్రియ
ముగ (నీతిశ్రేయపు బుద్ధినేడు గలయున్
ధీ నొక్కకండున్ ధృతిన్) సుకృతము
లెడఁ (బ్రీతి ప్రజ్వలితేచ్ఛ నల్పిరి జనుల్
ప్రేమం గనంగాలలిం), గనుకనుఁ,
దద్(భూతి శ్రేష్ఠతఁ దాటి హెచ్చునమయం
బుల్ పొందుచున్ మోదమ్మున) మనముల
గీ॥ నెంచి, రాముఁడందఱిలోన హెచ్చుతండు
క్షమ్యుఁడై మూఁడుపూలారు కాయలగున
టంచువారు విధివిరామ మంత విడిరి
ప్రభుఁడు కార్యనిర్వాహణోద్భటుని భటుని॥ 54

భా. శా॥ ఖ్యాతిస్ఫూర్తియుతైణలోచన లసత్ క్ష్మాపాత్మజల్ గొప్పగా

నీతి శ్రేయపు బుద్ధి నేఁడుఁగలయన్ ధీనాథ్యు కండ్లుగ్ ధృతిం
బ్రీతిప్రజ్వలితేచ్ఛ సల్పిరి జనుల్ ప్రేమం గనంగా లలిన్
భూతిశ్రేష్ఠతఁ దాటి హెచ్చు సమయంబుల్ పొందుచున్
మోదముగ్ ॥ 54

టీక రా. ఖ్యాతిగ్ - కీర్తితో, స్ఫూర్తియుత - కాంతినిగూడిన, (భా) ఖ్యాతిస్ఫూర్తియుత - కీర్తికాంతులగూడిన, (ఒకటేసమాసము) నీతిశ్రేయపుబుద్ధి, ప్రీతి ప్రజ్వలితేచ్ఛ, భూతిశ్రేష్ఠత, యను నిట్లె. నేడు (రా) రాజు (దశరథుడు,) కలయన్- (రా) పాల్గొనగా, ఏఁడు గలయన్- (భా) సంవత్సరపర్యంతరము పొందుటకు, సమయంబుల్- (రా) కాలములు. (భా) ఒడంబడికలు. నాలుగుపాదములందు, సీసమందు నాలవ యక్షరములు శార్దూలమున రెండవ యక్షరములగు ఁతి, ఁతి, ఁతి, ఁతి,లు రామాయణార్థమున లఘువులుగాను, భారతార్థమున గురువులుగా నున్నవి.

రా. చం. అనిపె వశిష్ఠసద్ (ద్విజునికై; సమయమ్మొకవేళదప్పు) కా
యన కని స్వేచ్ఛనా (విజయుఁ; డగ్రజసమ్మతిఁ బ్రీతి భూమి) జే
శునిఁ గొనితెమ్మనం (దనరి శుభ్రతనేఁడు; ప్రదక్షిణించి) బం
టును రఘురాముతో (గరిమనున్ మరలంజని గారమెచ్చఁ)గన్ 55

భా. గీ. ద్విజునికై సమయమ్మొకవేళఁ దప్ప,
విజయుఁ డగ్రజసమ్మతిఁ బ్రీతి భూమిఁ
దనరి శుభ్రతనేఁడు ప్రదక్షిణించి
గరిమనుగ్ మరలం జని గారమెచ్చ 55

టీక-సమయము (రా) కాలము (భా) ఒడంబడిక, విజయుఁడు (రా) జయశీలుఁడు(భా) అర్జునుఁడు. అగ్రజసమ్మతి-(రా) బ్రాహ్మణుండగు వశిష్ఠుని సమ్మతిని, (భా) అన్నయగు ధర్మరాజుసమ్మతిని, నేడు- (రా) రాజు ఏఁడు- (భా) వత్సరము. భూమిజేశుని- రాముని.

రా. చ. ఘనత భటుండు మేల్ (నియతి గద్దెకి నారిజనేత్రు కృష్ణు) రా
మునిపృథుభవ్యసు(స్థలికిఁబోయి కడంక వెసగ్ సుభద్ర) స

జ్జనసుతు రాఘవుం (గొనుచు నదుచి వచ్చెను; గూర్మినాత్మ)లం
గను చరుదెంచె నా(పురికి తన్మాతలనాథులమూక చూడ)గన్ 56

భా. గీ. నియతి గ్రద్దతి వారిజనేత్రుం కృష్ణు
వ్వలికిఁ బోయి కడంక తెపన్ సుభద్రఁ
గొనుచు నదుచి వచ్చెను గూర్మి నాత్మ
పురికి, తన్మాతలనాథులమూక చూడ॥ 56

టీక. రా. కృష్ణు- నల్లనివాని, సుభద్ర- మంగళకరమైన,(భా)ఆత్మపురి ఇంద్రప్రస్థపురము.

రా. సీ. కోవిదస్తోమంబు గుంపులయి (కనెను
గాదిలిని సుభద్రజననుతు నభి)
మాని రాఘవు; తెంపుఁగానము మన(మన్యు,
మహితసుగుణవంతు, మాన్యు, ఖాండ)
జముపైన గుటిసేయ జాలునీ భ(వవన
మునుఁగాల్పఁగావహ్ని పనివడిదఱి)
ప్రభుఁ డోపని వశిగావలయునంచుఁ(దలఁచె
దద్ధితమునుఁజేసెఁ దా విజయుఁడు)

గీ॥ దశరథేశ్వరుఁ డుచితయత్నముల సల్పి;
యుర్విజం గూడి యుపవాస ముండుమనియె
నతఁడు తాఙుత్సుకులకలశాబ్ధిచంద్రుడు;
రాముసందున బ్రీతిఁ బురజను లిడిరి 57

భా. గీ॥ కనెను గాదిలిని సుభద్రజననుతు, నభి
మన్యు, మహితసుగుణవంతు, మాన్యు; ఖాండ
వవనమునుఁ గాల్పఁగా వహ్ని పనిపడిదఱి
దలఁచెఁ; దద్ధితమునుఁ జేసెఁ దా విజయుఁడు 57

టీక. భా. సుభద్ర- మంగళకరములగు, ఖ-ఆకసమునందుండు, అండజము- పక్షిని ఏయుజాలు-కొట్టగలిగిన, అనగా అంతగుటిగలవానిని, భవవనమునుఁ గాల్పఁగావహ్ని- సంసారాటవినిఁగాల్ప నగ్నినిఁ బోలిన

వాఁడు కనెను- (రా)చూచెను (భా) ప్రసవించెను.

రా. సీ. ఆజనకోటి (ప్రియత నచ్యుతాప్తి బె
రసెఁ; దత్సుకృతిఁ గాంచి, రామణీయ
తను మించు నిజయశోధావళ్యమున సీతఁ
(డివము ప్రభను; వెల్గె మిప్పుల నర్థ)
ముదయుతారి యనిరి; భువివిభుఁడు యుధిష్ఠి
రవరుఁ డింద్రప్రస్థ) రమ్యధాన్య
మోదితభిక్షుం డపు డలంకరింపించె
(నగరి; భాసురగురునయమయసభ)

గీ॥ జనకునానతి పీడ త్మజావిభుండు;
పరమసంతోషమునఁ బొంగి పౌరులును శి
రసిరి చుట్టపక్కాలను; రంగరంగ
వైభవంబులతోఁ బురి ప్రజ్వరిల్లె॥ 58

భా. ఆ॥ ప్రియత నచ్యుతాప్తి శిరసెఁ దత్సుకృతి గాం
డివము; ప్రభను వెల్గె మిప్పుల నర్థ
భువివిభుఁను యుధిష్ఠిరవరు డింద్రప్రస్థ
నగరి భాసురగురునయమయసభ॥ 58

టీక. అచ్యుతాప్తిన్- (రా) నాశనముగాని యాప్తిని, (భా) కృష్ణుని యాప్తిచే, డివము ప్రభను-(రా) మంచుయొక్క కాంతి; అర్థముదయుతారి శకలములయిన సంతోషము గల శత్రువులుగలవాఁడు. ఇంద్రప్రస్థరమ్యధాన్యమోదితభిక్షుండు- శ్రేష్ఠములగు ఇంచెళ్ళగొలఁది మంచిధాన్యముచే సంతోషపఱచఁబడిన యాచకులుగలవాఁడు. గురునయమయసభ (రా) నయమయ- నీతిమంతుఁడగు, గురు- తండ్రియొక్క, సభ. (భా) గురు-ఎక్కువగు, నయ- నీతిగల, మయసభ మయునిసభ.

రా. ఉ॥ తాసితకీర్తి యా నృపుఁడు దగ్రతవెల్గెను భాసురంబుగా;
వాసిజరాగమంబునను భార్గవిగేహహితుండు క్రుంకెఁ బ
ద్మాసుతు భీముఁ డగ్నిమెడదన్ హాతమత్స్యధికోగ్రమూర్తియై

చేసెఁ బలర్క)ల నన్నటనఁ జేయునతండిపుడంచ నూయనాన్‌। 59

భా. కం॥ సితకీర్తి యానృపుఁ డుద
గ్రత వెల్గెను భాసురంబుగా; వాసిజరా
సుతు భీముఁడల్గి యెడఁదఁ
వాత మత్యధిక౦ గ్రమూర్తి యై చేసెఁ బలర్క॥ 59

టీక. (రా) జరాగమంబునను - ముసలితనము వచ్చుటచే (దినమంతయు వెల్గివృద్ధుఁడగుటచే;) భార్గవి - లక్ష్మీదేవియొక్క, గేహ - ఇల్లు నకు (పద్మమునకు) హితుఁడు - మిత్రుఁడు(సూర్యుఁడు) పద్మాసుతు - లక్ష్మీదేవికుమారుని (మన్మథుని), భీముఁడు - శివుఁడు, అతండు - ఆ శివుఁడు, లక్ష్మీదేవియింటికి హితుఁడు గనుకను, లక్ష్మీదేవికుమారుని శివుఁడుచంపె గావున, శివునిపై సూర్యునకసూయగలదనియు, సాయంకాలమున శివుఁడు నాట్యముచేయును గనుక, చూడలేక క్రుంకెనని భావము. (భా) జరాసుతు - జరాసంధుని.

రా. సీ॥ మించి చంద్రుండా క్ర(మించె ధరణిపాళి
నంచితరాజసూ)నాస్త్రమంత
పవనులు గొనిరి దంపతులచే నపజ(య
ము మఱి కువలయహితముగ ధర్మ)
మూర్తులగు సురలు ముదమున సుధఁగ్రోలఁ
గాఁ బండువెన్నెలల్ గాచె; సంత
నరవములు చకోర(సంతతి ధృతి నల్పె;
నద్రుచి హారి శిశు)జనతతిముఖ
గీ॥ సకలనరచిత్తతా(పాలుఁజడలెఁ; జక్రి)
పాటవము న)డఁచెఁ; వంతపాలయి వన
జాళి గన్నుల మూసెఁ; దేంట్లందు చిక్కె
సంత్రమమునొప్పంగెఁ; గఱఁగెను జంద్రశిలలు॥ 60

భా. ఆ॥ మించె ధరణిపాళి, నంచితరాజసూ
యము మఱి కువలయహితముగ ధర్మ

